# మరణానికి రెండు ముఖాలు

(కవితా సంపుటి)



ఆదిగోపుల వెంకటరత్నమ్

ప్రథమ ముద్రణ : జూన్, 1988
ప్రతులు : 1,000
ముఖచిత్రం : బాలి



ప్రింటింగ్ :
ప్రజాశక్తి ప్రెస్,
విజయవాడ - 520 002

ప్రచురణ :
ప్రజాశక్తి బుక్‌హౌస్
కారల్ మార్క్స్ రోడ్డు
విజయవాడ - 520 002

వెల : రు. 5-00

---

రచయిత :
అడిగోపుల వెంకటరత్నమ్
నాగార్జున యూనివర్సిటి
గుంటూరు - 522 510

గుంటూరు శేషేంద్రశర్మ

జాన్ బాగ్
హైదరాబాదు-2
23-5-1988

# భూమిక

మిత్రులు శ్రీ వెంకటరత్నం గారి కావ్యం పేరు 'మరణానికి రెండు ముఖాలు'. అందులో ఒకటి జననం అని ఈ దేశం చెపుతూంది. ఎన్ని రకాల బాధలు, ఎందరు అసంఖ్యాక మానవుల రోదనలు! ఇది దేశమా లేక మనిషికి కంఠపాశమా? అనిపిస్తోంది. ఎవడి గొంతు పిసుకుదాం, ఎవడి రక్తం తాగుదాం అని ఆక్రోశం ఉరికి పడుతూంది ఈ బాధలు భరించలేక—

శ్రీ వెంకటరత్నం గారు ఈ కావ్యాన్ని ఎంత గొప్ప రచనగా రూపొందించారంటే మన వర్తమాన దేశానికి ఇంతకంటే శక్తిశాలి చిత్రం మరొకటి ఉండబోదు అనుకోవచ్చు. ఈనాటి దేశానికి సారాంశం ఒక్కమాటలో చెప్పాలంటే ఈనాడు మనిషి కేవలం ఒక ఓటు, నేత ఒకడే దేశానికి పేటు (లేక చేటు)

శ్రీ వెంకటరత్నం గారి కావ్యం మనకు జ్ఞాపకం చెయ్యని బాధ అంటూ లేదు. ఈ కావ్యాన్ని భారతీయ బాధల నిఘంటువు అనవచ్చు. నిజంగా నా కనిపిస్తుంది. ఫ్యామిలీ ప్లానింగుకంటే, "మరణానికి రెండు ముఖాలు" అనే ఈ కావ్యాన్ని గర్భిణీస్త్రీలకు వినిపిస్తే, గర్భస్థ శిశువు ఈ దేశంలోకి ప్రవేశించడానికి భయపడి మాతృగర్భంలోనే ఉండిపోతాడు. లేకపోతే, అక్కడ్నుంచికూడా వెనక్కి పారిపోతాడు. ఎవడయినా ఒక శిశువు తెగించి ఈ దేశంలో అడుగు పెట్టాడో, ముందు వాడి కాలికి ఆకలి అంటుకుంటుంది. ఆకలో అని ఏడిస్తే ఆ శిశువుకు ఈ దేశస్థులు ఇటుపో అని ఫుట్ పాత్ లు చూపిస్తారు. ఫుట్ పాతులు కాదు—పొలాల వైపు పంపించరు. బాబూ! ఈ దేశంలో నగరం ఒక చెంబల్ వ్యాలీ, గ్రామం దేశానికి కూలీ!

శ్రీ వెంకటరత్నం గారి కళ్ళల్లో కన్నీళ్ళున్నాయి. గుండెల్లో దావానలం ఉంది. దేశం నిండా దుఃఖం ఉంది. ఇంకేం కావాలి కవిత్వానికి! వెంకటరత్నం గారి లాంటి వ్యక్తిత్వం అగ్ని పర్వతంలా బద్దలవుతుంటే ఆ లావా ప్రవాహాలే ఈ కావ్యంలో ప్రవహించే కవితలు. ఆయన భాష భయంకర ద్రాఘిష్ఠ సర్పాకృతి ధరించి—బుసలుకొడుతుంది. చదివితే చాలు నరనరానికీ వర్తమానతా స్పృహ వ్యాపిస్తుంది.

ఇలాంటి కావ్యాలే దేశాన్ని మార్చి మనిషి దుఃఖాన్ని హరిస్తాయి. ఇలాంటి కవులకే మనుషులు ఋణగ్రస్తులై ఉంటారు. శ్రీ వెంకటరత్నం గారికి నా హృదయపూర్వక అభినందనలు.

— గుంటూరు శేషేంద్ర శర్మ

# కొన్ని మాటలు

డా॥ సంజీవదేవ్

తుమ్మపూడి
24-5-1988

---

ప్రతి మాటకూ ఒక అర్థం ఉంది. (అర్థంలేని మాటా వుంది).
ప్రతి అర్థానికీ ఒక శక్తి ఉంది.
ప్రతి శక్తి ఏదో చేయంది ఉండలేదు. శక్తి అంటే కదలిక. కదలిక అనేది పని.

కనుక ప్రతిమాటా కూడా ఒక పని.
ప్రతి పనీకూడ ఏదో ఒక ఫలితాన్నిస్తుంది. ఆ ఫలితం మంచిది కావచ్చు, మంచిది కాకపోవచ్చు.
పని నిపుణతో చేయబడ్డపుడు కళ అవుతుంది.
మాటలు నిపుణతో కూర్చబడ్డపుడు కవితాకళ అవుతుంది. ఆ నేర్పుగల కూర్పు ఒక అనుభూతిని అభివ్యక్త పరుస్తుంది.
అటువంటి దాన్ని రచించిన వ్యక్తి, లేక వచించిన వ్యక్తి కవి అవుతాడు.

ఈ కవితలను సృష్టించిన శ్రీ అడిగోపుల వెంకటరత్నం అందుకనే కవి అయినాడు. "మరణానికి రెండు ముఖాలు" అనే దీన్ని రచించాడు. మనిషి కవితలను రచించినందున కవి అవుతాడు. కవి అయి కవితలను రచించడు. కవితలను రచించకముందు మనిషిగా ఉంటాడేకాని కవికాడు.

కొందరు కవులు సామాన్య కవితలను రచిస్తే ఇంకొందరు సామాన్యంకాని కవితలను రచిస్తారు.

శ్రీ వెంకటరత్నం కవితలు సామాన్య కవితలకంటే కొంత భిన్నం గానే ఉంటాయి.

అయినా అవి ఈ జగతుకు చెందినాయేకాని ఇంద్రధను జగతుకు చెందినయికాదు. దైనందిన జీవనంలోని దైన్యులకు దూరమైనవి కావు ఇందులోని కవితలు.

అయినా అవి ఒక విశిష్టరీతిలో వినిపిస్తాయి, ఒక విలక్షణ అనుభూతిని కలిగిస్తాయి, విచిత్ర ఆలోచనలు పుట్టిస్తాయి.

ఆలోచన పుట్టినపుడు సత్యానికి దగ్గరగా ఆలోచిస్తాడు.
అనుభూతి కలిగినప్పుడు సత్యాన్నిదాటి అనుభూతిస్తాడు.

"అన్నట్లు....
మొన్న నువ్వు బొమ్మకొనుక్కోమను
ఇచ్చివెళ్ళిన రూపాయితో
బాబిగాడు ఇల్లంతా చాక్లెట్లు పంచాడు
అందరికి ఎందుకురా అంటే
ఆకలి తీర్చుకోటాని కన్నాడు;
క్షమించు
కన్నీటి చుక్కలు పడి లేఖలో
రెండక్షరాలు కనుమరుగయ్యాయి
ఒకటి "న"
రెండోది "వ్వ"
ఉంటాను నేస్తం!"

జీవితంలో సంతోషం లోపించిందని చెప్పటానికి "లేఖ" అనే పై కవిత లోని అభివ్యక్తరీతి ఎంతో కవితామయంగా ఉన్నది. అందుకే అనిపిస్తుంది ఈ కవి ఒక విలక్షణ కవి అని, ఆయనవి విశిష్ట కవితలని.

కవి అందరివలె ఆహారం తింటాడు. అందరివలె నీరు త్రాగుతాడు. కాని అందరివలె ఆలోచించడు, అందరివలె అనుభూతించడు, అందరివలె స్వప్నించడు. అందరు చూసినట్లు రూప జగత్తును చూడడు. అందరు విన్నట్లు శబ్దజగత్తును వినడు.

వీటన్నిటినీ కొంత భిన్నంగా ఆచరిస్తాడు.

కవి కొంతగా కల్పనాజీవి అయినప్పటికీ వాస్తవానికి భిన్నమైంది కాదు కవి కల్పన. ఆయన వాస్తవం కవితా వాస్తవం (Poetic realism).

ఒకప్పటి కవితలో అలంకారాల బాహుళ్యం ఉండేది. ఒక కవి ఉపమాలంకారాన్ని వాడి ఫలాని మనిషి మనస్సు పూవులాగా కోమలంగా ఉంది అంటే మరొకవి మరొక ముందడుగు వేసి ఫలాని మనిషి మనసు ఒక పూవు అని రూపకాలంకారాన్ని వాడతాడు

నేటి వచన కవితలో కాని, పద్య కవితలోకాని అలంకార బాహుళ్యం తగిందేకాని అలంకారాలు అంతరించలేదు. మితంగా వాడితే నిబద్ధకవితలోకాని అనిబద్ధకవితలోకాని అలంకారాలు పెద్దగా అడ్డంకులేమీకావు.

ఈ కవితా సంకలనంలో ఉపమలు, రూపకాలు, ఉత్ప్రేక్షలూ లేవనే చెప్పవచ్చు. చాలా వచనకవితల్లో వీటి బాహుళ్యం గోచరిస్తుంది. కాని ఈ వచన కవితల్లో అది గోచరించదు.

అంటే అలంకారాలుండటం తప్పనికాదుకాని అవిలేకుండా కవితను రక్తి కట్టించటం కష్టం.

ఈ కవితల్లో చమత్కారం ఎక్కువగా గోచరిస్తుంది. దాదాపు ప్రతి కవితా కొంత చమత్కారంగా వినిపిస్తుంది. ఇంగ్లీషులో పేరాడాక్స్ అంటారే అటువంటి దానినీడలు ఈ కవితల్లో దర్శనమిస్తాయి.

అంతగా దీర్ఘమైన కవితలు కానందున వీటిలోని చమత్కార ప్రయోగాలు వెగటు కలిగించవు.

"కలం చీకట్లో కూర్చుంది
చీకట్ని తిట్టుకొంటూ
వెలుగు చీకట్లో కూర్చుంది
చీకటి చేసిన విందును తింటూ;
శిశిరం చెట్టు ఆకుల్ని రాల్చింది
వసంతం చెట్టును చిగురించింది
కర్తవ్య నిర్వహణలో
దేనికదే పోటీ:
గుప్పెట్లోని వెలుగును
గూట్లోకి చేర్చేదెవరు
గూట్లోని వెలుగుతో
గూటిని సరిదిద్దేదెవరు?"

చమత్కారం మాత్రమే ఉత్తమ కవితకు ప్రధానలక్షణంకాదు కాని చమత్కారం దుర్లక్షణం కూడాకాదు.

నిత్యం మనమంతా అతిసామాన్యజగత్తులో జీవిస్తుంటాం. ప్రతిచోటా సామాన్యమే, ప్రతివేళా సామాన్యమే అయేవరకు మనిషిమనసుకు ఓర్చుకోలేని విసుగు జనిస్తుంది. ఆ విసుగుకు విరుగుడు నిమిత్తమే అనేకమైన కళలు—కవిత, సంగీతం, చిత్రం, శిల్పం,నర్తన, మొదలైనవెన్నో.

ఈ విధంగా నిత్యజీవితంలో కొంత అసామాన్యత అవసరం అవుతుంది. రచనలోని విషయం సామాన్యమైనా దాని రచనారీతిలో అయినా కొంత అసామాన్య విధానం అవసరం.

ఈ కవితా సంకలనంలోని ఖండికలన్నీకూడా ఎక్కువగా ఈ విధానాన్ని అనుసరించే ఉంటాయి–సామాన్య విషయం, సామాన్యానికి కొంత భిన్నమైన రూపం.

"అక్షర జగత్తులో అలజడి రేగింది
సత్తకు చలనం పోసి తిమిరాన్ని తరమాలి
తండ్రిని నడిపే బాధ్యత తనయుడిపై పడింది.
బాధ్యత తెలియని తండ్రికి
బాధ్యత తెలిసిన కొడుకే తండ్రి !"

అతి సామాన్య పదాలతో అసామాన్య చిత్రణ. తండ్రికి కొడుకు కొడుకవుతాడు కాని తండ్రి కాడు. కాని పై కవితలో కొడుకును తండ్రికి తండ్రిని చేశాడు మన కవి !

ఆధునిక వచన కవిత అందరికీ అందుబాటులోకి వచ్చింది – రచించటంలో కవికి, ఆస్వాదించటంలో పాఠకుడికీ. కాని వచన కవితను రచించటంకాని, రచించిన దానిలోని భావాన్ని అందుకోవటంకాని అంత సులభమైన పనికాదు.

ఛందోబద్ధమైన కవిత చెవికి ఇంపుగా ఉంటుంది. అందువల్ల అది పాఠకులను త్వరలో ఆకర్షిస్తుంది. వచన కవితలో అటువంటి శ్రవ్య ఆకర్షణ ఏమీ ఉండదు. అందువల్ల దానిలో భావవైశిష్ట్యం ఉంచేనే కాని అది ఆకర్షకంగా ఉండదు అది అంత సులభమైన పని కాదు. కనుక అందరి వచన కవితలూ ఆకర్షకంగా ఉండవు.

కొందరి వచన కవితలు కవితలేని వచనంలాగా ఉంటాయి. ప్రవీణుల వచన కవితలు మాత్రమే కవిత ఉన్న వచనంగా ఉంటాయి. అందుకే వచన కవిత అంటే అంత తేలికయిన రచన కాదు.

ఈ సంకలనంలోని వచన కవితలు కవితగల వచనం. అందుకే అవి ఆకర్షక రచనలుగా ఉన్నాయి !



అడిగోపుల వెంకటరత్నమ్

కాయితం మీద కవిత కాని, నాలుకమీది కవితకాని సమాజంలోని చీకటిని కాల్చివేయలేదు, బురదను కడిగివేయలేదు, బూజును దులిపివేయలేదు, ఆకలిని ఆర్పివేయలేదు. ఇవన్నీ క్రియాశీలతతో తొలగాలసిందే కాని మాటలతో తొలగవు. మాటలుమాత్రం క్రియాశీలత కాదా అంటే అవును కాని మాటల క్రియాశీలత వేరు, ఆచరణ క్రియాశీలత వేరు.

కవితలు సూటిగా సమాజానికి మేలుచేయలేవు. కాని మేలుచేసేవారికి ప్రేరణనిస్తాయి. అంటే అవి సమాజానికి స్థూల సేవచేయలేకపోయినా సూక్ష్మ సేవను చేస్తాయి. స్థూలసేవ మాత్రమే సేవకాదు, సూక్ష్మసేవకూడ సేవయే.

ఆకలి కవిత్వం ఆకలిని పోగొట్టదు, భక్తి కవిత్వం దైవాన్ని ప్రత్యక్షం చేయదు. ఈ రెండూ కూడ తగిన కార్యసాధన వల్లనే సఫలం అవుతాయి. ప్రత్యక్షమైన దైవం మనిషిని సృష్టించిన దైవమాలేక మనిషిచేత సృష్టించబడిన దైవమా అనేది వేరు విషయం.

అయితే ఇంతకూ సాహిత్యం కాని మరోకళ కాని సమాజాన్ని మార్చలేదనే అర్థమా ? ప్రత్యక్షంగా మార్చలేదు, పరోక్షంగా మార్చగలదు. అదేవిధంగా సమాజం కూడా సాహిత్యాన్ని కాని మరోకళను కాని పరోక్షంగా మార్చగలదు. మన కవి అంటాడు :

"ఇన్నేళ్లూ
వణికించిన చేతుల ముందు
వణికిన చేతులు నేడు వణకలేదు
మార్పుకు నాంది :
ఇన్నేళ్ళూ
దడిపించిన గుండెముందు
దడిసిన గుండె నేడు దడవలేదు
మార్పుకు ఆరంభం :
ఇన్నేళ్ళు
నిప్పులు కురిసిన కళ్ళముందు
మాడినమేను నేడు మాడలేదు
మార్పుకు సంకేతం :
ఇన్నేళ్ళు
ఆజ్ఞాపించిన శిరస్సు ముందు
వంగిన శిరస్సు నేడు వంగలేదు

మార్పుకు పునాది :
నేటి మార్పుల పట్టిక
రేపటి తీర్పుల పుట్టుక !"

ఇటువంటి మార్పుకావాలి మనిషి జీవితంలో. పై కవితను చదివినంత మాత్రాన మనిషిలో మార్పురాదుకాని మారాలనే సంకల్పం ఏర్పడుతుంది; ఏర్పడిన సంకల్పం ప్రయత్నంలోకి రూపొందుతుంది. రూపొందిన ప్రయత్నం సఫలీకృతం అవుతుందికూడ; ఎప్పుడైనా కాకపోవచ్చు కూడ, అది వేరే విషయం.

ఏది ఏమైనా, కవితాశాస్త్రాలు ఏవిధంగా ఉన్నా, కవితా ప్రక్రియలు ఏ తరహాగా ఉన్నా, కవితా లక్ష్యాలు ఏరకంగా ఉన్నా శ్రీ అడిగోపుల వెంకట రత్నం కవితలు మాత్రం కమనీయంగా ఉన్నాయి.

వాటిని చదువుతున్నంతసేపు ఆలోచననిస్తాయి, అనుభూతి నిస్తాయి ; చదివి ముగించిన తరువాత వాటి ఛాయలు దగ్గరనుండి దూరానికి, దూరం నుండి సుదూరానికి పొడవయి పోతూ పోతూ ఇంకొంతసేపటికి పొడవు, లోతుగా, మారిపోతుంది. పొడవు నీడలు లోతునీడలయి హృదయాన్ని తొలుస్తాయి.

మన కవి వృత్తిరీత్యా నాగార్జున విశ్వవిద్యాలయంలో ఇంజనీరు. ఇది వరకే కొన్ని తన కవితా సంకలనాలను బయటికి తెచ్చారు. అంటే అవి భూతకాలం అన్నమాట. ప్రస్తుత సంకలనం వర్తమానం. ఇక రానున్నవి భవిష్యత్.

కనిపించిన భూతకాలం మీదకంటే కనిపిస్తున్న వర్తమానం మీదకంటే కనిపించని భవిష్యత్ మీద విలువ ఎక్కువ వుంటుంది. అందుకే శ్రీ వెంకటరత్నం విషయంలో కూడ ఎక్కువ ఆశతో మనం ముందుకు చూద్దాం.

వృత్తి కవులకంటే ఔత్సాహికకవుల రచనలు ఎక్కువ రమ్యంగా ఉంటాయి అనేది గుప్తంకాని సత్యం వృత్తికవులకు తాము కవులం అనే జ్ఞాపకం చెదరక నిరంతరం మనసులో నిలచి ఉంటుంది.

ఔత్సాహిక కవుల్లో అది నిరంతర స్మృతిగా ఉండక అపుడపుడు మెరవటంతో నూతన చేతన మేల్కొంటుంది, తళుక్కున ఒక మెరుపు మెరుస్తుంది, తమకు తెలియకుండానే, ఆమెరుపే వారి కవిత. అందుకే ఆ కవితకంత మెరుపు !

— డాక్టర్ సంజీవదేవ్

ఇందులోని కవితలు ఆంధ్రపత్రిక దినపత్రిక, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, ఆంధ్రజ్యోతి వారపత్రిక, ప్రజాశక్తి దినపత్రిక, మయూరి వారపత్రిక, స్రవంతి మాసపత్రికలలో ప్రచురించబడ్డాయి. ఆ పత్రికాధిపతులకు మరియు ముందుమాట వ్రాసిన డా॥ సంజీవదేవ్‌గారికి, శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారికి కృతజ్ఞతలు.

—అడిగోపుల వెంకటరత్నమ్

# మరణానికి రెండు ముఖాలు

ముందుగానే
నా మరణ వాఙ్మూలం
ప్రభుత్వ రికార్డులో నమోదైంది :
ఆకలి చావైతే
అన్ని రుగ్మతలతో
అనారోగ్యం పాలయ్యానని :
లాకప్ మరణమైతే
విరక్తిచెంది
విషం పుచ్చుకొన్నానని :
వరకట్నం చావైతే
వంటచేస్తూ
ఒంటికి నిప్పంటుకుందని :
మానభంగం చావైతే
మారణాయుధాలు చేస్తూ
మరణించిందని:
ముందుగానే
నా మరణ వాఙ్మూలం
ప్రభుత్వ రికార్డులో నమోదైంది :

# నెలకు ముప్పై సంవత్సరాలు

నువ్వు రాసిన ఉత్తరం చేరింది
క్షేమ సమాచారం తెలిసింది
నా విషయం షరా మామూలే
నేను రాస్తున్నది అంతా మామూలే !
నిశ్శబ్దం లేని లైబ్రరీలో
నిశ్శబ్దం బోర్డుల్ని చూస్తూ
శబ్దంలో నిశ్శబ్దాన్ని వెతుక్కుంటూ
స్తబ్ధంగా ఒక మూల కూర్చుంటున్నా !
చెదలు పట్టి చినుగు పట్టిన
పుస్తకాల్ని దుమ్ము దులుపుకుంటూ
సోదర సోదరీ మణులు
చించేసిన పేజీల్ని వెతుక్కొంటూ
నా పాదాలు ప్రదక్షిణ చేస్తున్నాయి !
రాదని తెలిసిన యం.ఓ. కోసం
వస్తుందనే ఆశ నా వెంటబడగా
ఎదురైన వ్యక్తిలో పోస్టుమేన్ను చూస్తూ
నా కళ్ళు నిత్యం భ్రమిస్తున్నాయి !
గోళ్ళులేని గోడ్లు మెడలు చేబట్టి
విద్యాలయం నుండి విశ్వంలోకి
ఉద్యోగం కోసం నిరుద్యోగిగా
ఈవత్సరం నన్ను ప్రసవించబోతూంది !
ఎదురుచూసే జీవితానికి
నేనెంత ప్రథమ సంతానం ఐనా
ముప్పూట తిండిదొరికే నౌకరీ ఒకటి కావాలి
నిరుద్యోగిగా నేకాలాన్ని కొలవలేను
కారణం నీకు తెలుసు
నిరుద్యోగికి నెలకు ముప్పై సంవత్సరాలు


అడిగోపుల వెంకటరత్నమ్

# ధర్మాసుపత్రి

ఎండిన కళ్ళు సర్కారు దవాఖానాలో
ఎండమావుల్ని వెదుకుతున్నాయి
ఎండిన పేగులు గవాక్షాలకు
తోరణాలై వేలాడుతున్నాయి
తెల్లవార్లూ కనలేక ఏడ్చిన తల్లి
కన్న శిశువును కనకుండా పోయింది
కనడానికి వచ్చిన తల్లి
తన కాన్పు గుర్తొచ్చి కన్నీరు కార్చింది
వార్డుల్లో జీవచ్ఛవాలు
మందుల కోసం మొక్కనివాళ్ళులేరు
మందులు ముఖద్వారం గుండా
నల్లబజారుకు నడుస్తుంటే ఆపినవాళ్ళులేరు
ప్రభుత్వానికి
పెరాలసిస్ సోకింది
ప్రభుత్వ ఆస్పత్రి
పక్షవాతాన పడింది!

# తూర్పు వాకిలి తెరిచివుంది

పదవి పల్లకైంది
ప్రజలకు మోతైంది
లంచం లాంఛనమైంది
నీతి హేళనైంది
విద్య వ్యాపారమైంది
ఉద్యోగం వేలం పాటైంది
కులం గుమ్మడి తీగైంది
కలం వ్యాపార పరమైంది
గమనం స్తబ్ధమైంది
కాలం నిశ్శబ్దమైంది
నిశ్శబ్దంలో
అణువు నిండి వుంది
అది అణుబాంబై
పేలనుంది
తూర్పు వాకిలి తెరిచివుంది !

# అస్పృశ్యుడు

అందరికీ అంటరాని వాడినయా
అందరికీ అవసరమున్న వాడినయా
ఆదినుండీ నా పేరు అస్పృశ్యుడయా
నేటికీ నా నామం అదేనయా !
గూటినుంచి ఓటు కోసం లాగినారయా
అస్పృశ్యుడే అధినాయకుడని పాడినారయా
పదవి కోసం పదిమందిలో కలిపినారయా
పేరుకోసం పదిమందిలో పాకులాటయా
వక్రదారిన నడవను వెతుకులాటయా
పదవి పొందిన ప్రభువులు మరచినారయా
పదవికి నిచ్చెనై నిలచిన వాడినయా
పదవీచ్యుతులకు జ్ఞప్తికి వస్తానయా
అస్పృశ్యుడే ఆదిదేవుడని పొగడుతారయా
అనాదిగా నా పేరు అస్పృశ్యుడయా
నేటికీ నా నామం మారలేదయా
నేటికీ నా స్థానం అదేనయా !

# నేటి మార్పుల పట్టిక

ఇన్నేళ్ళూ
వణికించిన చేతులముందు
వణికిన చేతులు నేడు వణకలేదు
మార్పుకు నాంది!
ఇన్నేళ్ళూ
దడిపించిన గుండెముందు
దడిసిన గుండె నేడు దడపలేదు
మార్పుకు ఆరంభం!
ఇన్నేళ్ళూ
నిప్పులు కురిసిన కళ్ళముందు
మాడిన మేను నేడు మాడలేదు
మార్పుకు సంకేతం!
ఇన్నేళ్ళూ
ఆజ్ఞాపించిన శిరస్సుముందు
వంగిన శిరస్సు నేడు వంగలేదు
మార్పుకు పునాది!
నేటి మార్పుల పట్టిక
రేపటి తీర్పుల పుట్టుక!

# నడుస్తున్న చరిత్ర

రాగద్వేషాలు రగిలి
ఇద్దరు విద్యార్థులు ఒక్క క్లాసులో
ఒద్దిగ్గా కూర్చోని కాలమిది:
ఇన్విజిలేటరు ఒంటరిగా
ఇంటికి చేరని కాలమిది:
ఆకసాన నక్షత్రాల్ని లెక్కించే కాలమిది
బలవంతుడి లెక్కలనే బలపరిచే కాలమిది:
చదివినవాడికి మార్కులు రాని కాలమిది
ప్రశ్నాపత్రం గుట్టుపెట్టాల్సినవాడే
బట్టబయలు చేస్తున్న కాలమిది:
ఇంటి దొంగను ఈశ్వరుడు పట్టిన కాలమిది
ఇంట్లోవాళ్ళు ఈశ్వరుడ్ని శిక్షించిన కాలమిది:
తల్లి భారతికి గంతలు కట్టి
తనయులు తాకట్టుపెడుతున్న కాలమిది:
కడుపుకొట్టి కడుపు నింపుకొనే కాలమిది
కడుపు నిండినా కడుపు కొట్టటం మానని కాలమిది:
ఎంతటి వింతకాలమిది
మరెంతటి చేటుకాలమిది:

# నీటిబొట్టు

శ్రమజీవి శరీరంపై
చెమటబొట్టుగా నిన్ను చూసినపుడు
విశ్వాన్ని గెలిచిన
విజయగర్వం నీలో చూశా!
ఉషోదయంలో
గడ్డిపరకపై కూర్చొని
ఆణిముత్యమై వెలుగుతూ
అందర్నీ ఆకర్షించే నిన్ను చూశా!
కలకంఠకంఠి కళ్ళల్లో
కన్నీరై తొంగిచూసి
కలకంఠకంఠి వెతలు
నువ్వు కథలుగా చెప్పడం చూశా!
ఎండిన మొక్క మొదట్లో చేరి
నువ్వు పండిస్తున్నప్పుడు
విశ్వజన శ్రేయస్సుకై
నిరంతర నీ కృషిని చూశా!
నోరెండిన మనిషి నోట్లో చేరి
మరణంలోంచి జీవంలోకి
మనిషి పయనిస్తున్నప్పుడు
కరుణామయమౌ నీ కంట తడిని చూశా!

# లేఖ

కంటినిండా నిద్ర ఎక్కడుంది నేస్తం
కోడిలా కూర్చొని కునుకు తీయడం తప్ప!
నా ప్రభుత్వమే
నా పక్కలో బల్లెమై
రోజూ గాయాలు చేస్తూవుంటే
ఎంతమంది సర్జన్లకు చూపించను
ఎన్నిసార్లని సర్జరీ చేయించను!
అన్నట్లు....
మొన్న నువ్వు బొమ్మ కొనుక్కోను
ఇచ్చి వెళ్ళిన రూపాయితో
బాబిగాడు ఇల్లంతా చాక్లెట్లు పంచాడు
అందరికీ ఎందుకురా అంటే
ఆకలి తీర్చుకోడాని కన్నాడు!
క్షమించు
కన్నీటిచుక్కలు పడి లేఖలో
రెండక్షరాలు కనుమరుగయ్యాయి
ఒకటి "న"
రెండోది "వ్వ"
ఉంటాను నేస్తం!

# నాసిరకం మొక్కలు

సాహిత్యాన్ని వ్యాపారం టోకుగా కొనేసి
క్షుద్రాన్ని కనేసి మార్కెట్లో వదిలేసింది!
చీకట్లో సాహిత్యం చౌరస్తా చేరినపుడు
దారికానక మళ్ళినదారి యిది
నాటి స్తబ్దతే నేటి యీ క్షుద్రత!
సాహితీ కేదారం ఎప్పుడూ సస్యశ్యామలమే
నాటి పెంచినవే నాసిరకం మొక్కలు
సూర్యుణ్ని మింగింది రాహుకేతువులని
శాస్త్రీయంగా రచనల్లో చూపే ప్రయత్నం
మెడుల్లా ఆబ్లాంగేటా క్షణకాలం స్తంభించే
శాస్త్రీయంగా అశాస్త్రీయ రచనలు!
అక్షర జగత్తులో అలజడి రేగింది
స్తబ్ధతకు చలనంపోసి తిమిరాన్ని తరమాలి
తండ్రిని నడిపే బాధ్యత తనయుడిపై పడింది
బాధ్యత తెలియని తండ్రికి
బాధ్యత తెలిసిన కొడుకే తండ్రి!



అడిగోపుల వెంకటరత్నమ్

# దేశంలో దొంగలు పడ్డారు

దేశంలోదొంగలు పడ్డారు
భారతమాత బంగారు అందెలూ
వజ్ర ఖచిత వడ్డాణం
నవరత్న భరిత మకుటం
దోచుకు వెళ్ళారు దుర్మార్గులు!
ఎవరు దోచారో
తల్లి భారతికి తెలుసు
ఎక్కడికి తరలాయో
ఆ తల్లి బిడ్డలకు తెలుసు
ఏ బ్యాంకుల్లో దాచారో
ఈ దేశ ప్రజలకు తెలుసు
తెలిసీ తిరిగిరాని యీ సంపదంతా
ఎలా వెలికి తీయాలో వెతకండి ప్రజలారా
దొరల్లా వీరవిహారం చేస్తున్న
ఈ దొంగల్ని పట్టండి జనులారా!

# అవినీతి

విత్తులు నాటితే
కత్తులు మొలవవు
చారెడ్ని
దోసిళ్ళతో పంచుకోలేము
అవినీతిని మింగిన ప్రభుత్వం
నీతిని కక్కదు!
మింగింది జీర్ణం కానినాడు
కక్కేయడం అనాది ఆచారం
కాదని బుకాయించడం
అనాది సాంప్రదాయం!
ప్రభుత్వం గేలరీలో కూర్చొని
ప్రజల్ని రంగస్థలంపై
నటింపజేస్తూ వుంది
ఇంకేం....
ప్రకటించబోయే ఫలితం
ప్రజలందరికీ ముందే తెలుసు!

# నాకోసం శ్రమించేది...

కళ్ళెదుట ఘోరాన్ని
చూడనీకుండా
కనురెప్పలు
కంటిని బలవంతంగా మూశాయి!
కన్నీరు
ముఖం ముడతల్లో
కలకాలం నిలిచి
జలాశయాలయ్యాయి!
బ్రతికినంత కాలం
లేడికి ఒకటే భయం
పులివాత తప్పించుకోడం!
నా కోసం
నా చినుగుల దుప్పటి
ఎంత శ్రమిస్తూంది....!
ఎంతసేపూ
తను వణుకుతూ
నా చలిని కాస్తూంది!

# అరుణ పతాకం

దేశంలో
ప్రగతి నడక పోటీలో
నత్త ప్రథమ స్థానం గెల్చింది!
చైతన్య పరుగు పందెంలో
తాబేలుకు మొదటి స్థానం దక్కింది!
ఒక ప్రక్క కొన్ని జెండాలు
ప్రజల భుజాన ఊరేగుతున్నాయి
ఊరేగి మజూరి అందుకుంటున్నాయి!
జెండాల హంగూ ఆర్భాటం
తళుకూ బెళుకులూ
పార్టీ ఫండుపై ఆధారపడున్నాయి!
మరో ప్రక్క
పీడిత ప్రజ హృదయాల్లో
రక్తారుణ విత్తనాలు మొలకెత్తి
ఎర్రనిబావుటాలై
ఎల్లెడలా అలలై
ప్రజల్ని కూడగడుతున్నాయి
ప్రజలకు కూడు పెడుతున్నాయి
ప్రజాస్వామ్య శకటానికి
ఎలపట
దాపట
అరుణ పతాకం ఎగిరేదెప్పుడు?

# విద్యా వ్యాపారం

యూనివర్శిటీ గోల్డు మెడల్సు చేపట్టి
పేరుబడ్డ యాజమాన్యం వారికి
పారితోషికం యిచ్చి
పేరుకు లెక్చరర్ పదవి చేపట్టా!
మింగే మెతుకులు నావే
మీసాలకు సంపెంగి నూనె నాదే!
కాలేజీలో కాలూనినందుకు
నెల నెలా అద్దె క్రింద
నాలుగొందలు మినాయించి
మూణ్ణెల్లకోసారి మూడొందలు జీతం యిస్తూ
ఇరుసుకి కందెనెయ్యకుండా
ఇరుసును త్రిప్పుతూంది యాజమాన్యం!
అర్థాంగి ఆకల్ని మింగేశాక
కోపించిన ఆకలి పిల్లల్ని మింగేసింది!
తీగలాగితే డొంకంతా కదులుతుందని
తీగను లాగా....
డొంక కదిలింది!
కదిలిన డొంక నా వెంటపడింది!
మిత్రులారా! ప్రజాహితులారా!
సోదరీ సోదరులారా! నాబోటి అభాగ్యులారా
రండి! రండి!
నాకు సాయంగా నిలవండి
కదిలిన డొంకను కూల్చివేద్దాం రండి!

# చీకట్ని తరిమి...

ప్రభుత్వం ప్రజల దగ్గరకొచ్చింది
అటుకులు పెట్టి కన్నీరు కార్చింది
కుచేలురను ఓదార్చి
కాలం గడుపుక వెళ్ళింది!
అద్దం అబద్ధం చెప్పదు
తన ఉనికికి కళంకం రానివ్వదు
ఎల్లకాలం టార్చిలైటు
వెలుగు చూపే ప్రభుత్వం
ఎంతకాలం నిలుస్తుంది!
ఎంత మోసం!
సముద్రాన్ని చూస్తూ
నోరెండి పోయింది
ఎంతకాలం గడిచింది?
పిరికితనం ధైర్యాన్ని తెచ్చింది
గడ్డిపరకలు
వెంటిగా మారాయి!
అప్రమత్తం కాని నడక ప్రమాదం
చీకట్ని తరిమి
చేతులు కట్టుక కూర్చుంటే
తానే వెలుగంటూ
చీకటి మళ్ళీ వచ్చి కూర్చుంటుంది!

# వైపరీత్యం

చవిటి నేలలో బీజం మొలకెత్తింది
సాగు భూమిలో బీజం చనిపోయింది
ప్రగతి చెంత విషాదం అలుముకొంది!
సాహిత్యంలో క్షుద్రం అవతరించింది
పాఠకుడిలో ఆలోచన అంతరించింది
చైతన్యం చెంత స్తబ్ధత ఆవరించింది!
ముల్లు కంచై పువ్వును కాస్తూంది
పువ్వు ముల్లుని శత్రువుగా చూస్తూంది
రక్షణ చెంత నమ్మకం దోషిగా నిలిచివుంది!
శ్రామికుని స్వేదం నిత్యం పారుతూంది
యజమాని ఇంట బంగారం నిండుతూంది
శ్రమ చెంత దోపిడి చేరివుంది!

# కదలండి

కూలి చేసినవాడు
కోట్లు గడించాడు
వాడి చరిత్ర నేడు
ప్రభుత్వం నిర్ణయించిన పాఠ్యాంశం
వాడి ఎత్తులూ పైయెత్తులూ
ప్రజలకు స్ఫూర్తంటూ పాఠ్యాంశం వివరణ!
కూలి చేస్తున్న కోట్లమందిలో
కూలి చేసిన ఒకడు
కోట్లు ఎలా గడించాడో
ప్రశ్నిస్తే
పిడికెడు గుండెను పిండి ప్రభుత్వం
కడివెడు కన్నీరు కార్పించింది!
అందరి పరుగూ సమాధివైపే
అన్నవాడ్ని నువ్వు నమ్మకు
వందమీటర్ల పరుక్కి
వేయి మీటర్ల నడక్కి
ఒక ఆఖరి పాయింటు వుంది
ఆకలి బ్రతుకుల పరుక్కి
అంతిమ గీత లేదు!
కదలిక లేని స్తబ్ధతను
కదిలించను కదలండి
ఆకలి ఉద్యమంపై
ఏ అణుబాంబూ పనిచెయ్యదు!

# కర్తవ్యం

కలం చీకట్లో కూర్చుంది
చీకట్ని తిట్టుకొంటూ
వెలుగు చీకట్లో కూర్చుంది
చీకటి చేసిన విందును తింటూ!

శిశిరం చెట్టు ఆకుల్ని రాల్చింది
వసంతం చెట్టును చిగురించింది
కర్తవ్య నిర్వాహణలో
దేనికదే పోటీ!

గుప్పెట్లోని వెలుగును
గూట్లోకి చేర్చేదెవరు
గూట్లోని వెలుగుతో
గూటిని సరిదిద్దేదెవరు?

## నీ చేతిలోనే వుంది

కడలిని
పడవ
చీల్చేవరకు
కడలి
అభేద్యం!
చీకటిని
చిరుదీపం
చీల్చేవరకు
చీకటి
అగమ్యం!

## పన్నులు - ధరలు

ప్రభుత్వానికి
ఆకలేస్తే
పన్నులకు
అంతమెక్కడిది!
ధరలకు
ఆకలేస్తే
దరిద్రులకు
అన్నమెక్కడిది!

# కాంతి యుగానికి పయనం

గుండెను
రాయి చేసింది
గుండే !
రాయికి
రాగం నేర్పింది
గుండే!
రాగం నుండి
రాయికి పయనం
రాతియుగానికి పయనం!
రాయి నుండి
రాగానికి పయనం
కాంతియుగానికి పయనం!

# బడ్జెట్

సంవత్సరాని కోసారి
సమర్పించబడే బడ్జెట్
రాజకీయ కురు సభలో
పేదవాడి వస్త్రాపహరణం!

# మనిషి మనిషికి మధ్య…

నడిచిన నేల గాలికి పట్టదు
ప్రాణం పోయడమే దాని పని!
విసిరిన రాయి తరువుకు పట్టదు
పళ్ళను రాల్చడమే దాని పని!
ముడిచిన శిగ పువ్వుకు పట్టదు
పరిమళం వెదజల్లడమే దాని పని!
పితికిన వాడి గోత్రం గోవుకు పట్టదు
పాలు యివ్వడమే దాని పని!
మనిషి ఉనికి మనిషికి పడదు
వాడి గొంతు నులమడమే వీడి పని!

# నియంత పాలన

మనిషికో బోను పెట్టి
నియంత పాలిస్తాడు!
తను పెట్టిన బోను
తన్ను పిలిస్తే
ప్రజాస్వామ్యం వల్లిస్తాడు!

## లాటరీ

నా అదృష్టాన్ని నా ప్రభుత్వం
లాటరీ టిక్కెట్టులో దాచి
నిత్యం పరీక్షించుకోమని
నా చెవిలో పోరుతూంది!
నా ప్రభుత్వ మనుగడ
నా అదృష్టంలో దాచి
నా కష్టార్జిత రూపాయిపై
నా ప్రభుత్వం కన్నేసింది!

## పల్లె - పట్నం

నగరం నిద్ర లేచింది
పాలకై
పసిపాపలా ఏడుస్తూంది!
పల్లె నిద్రలేచింది
తల్లై
పాపకు పాలు అందిస్తూంది!

# అందలంపై అవినీతి

అవినీతి

తెలుపై

ఖద్దరులో తిరుగుతూంది

రాజకీవి వొలుకుతూంది!

నీతి

నలుపై

నగ్నంగా తిరుగుతూంది

పేదతనం పలుకుతూంది!

# స్వాతంత్ర్య చరిత్ర

అర్థరాత్రి నిద్రలో స్వాతంత్ర్య జననం

మేలుకొనే సమయానికి స్వాతంత్ర్య మరణం!

సూర్యుడింత వరకు చూడంది స్వాతంత్ర్యం

స్వాతంత్ర్యమింత వరకు చూడంది కిరణం!

అడిగోపుల వెంకటరత్నమ్

# విప్లవించడానికే

భూమిని దున్నడం
గాయపర్చడం కాదు
నారుని పీకడం
హింసించడం కాదు
అంటుని నరకడం
చంపేయడం కాదు!
తొలి దశలోంచి
మలి దశలోకి
విప్లవించడానికే!

# ఋణభారం

పుట్టిన బిడ్డ
భరతమాత వొళ్ళో
మూడు కేజీలు తూగుతున్నాడు!
విదేశీ ఋణభారం
మూడు వందల రూపాయలు
నెత్తిపై మోస్తున్నాడు!!

## సత్యం వధ - ధర్మం చెర

హేమా హేమీ న్యాయవాదులు
తమ వాదనల్లో
న్యాయాన్ని అన్యాయాన్ని
కోర్టులో వదిలాక
న్యాయమూర్తి న్యాయాన్ని బంధించాడు
అన్యాయపు ఆంబోతు
అలవికాక పొయ్యేసరికి!

## స్ఫూర్తి దాతలం

మేము పుట్టకముందే
మా శ్రమశక్తి
టోకుగా కొనబడింది!
మేము పుట్టాక
దోపిడీ బాటకి కీర్తిశేషులం
పోరుబాటకి స్ఫూర్తి దాతలం!

# వేషం

రంగు మార్చిన నాయకుని నినాదం
గోడపై రంగు మార్చింది!
రంగు మార్చని నాయకుని నినాదం
గోడపై రంగు మాసింది!
నోరులేని గోడ కన్నీరు కార్చింది
నోరులేని ప్రజ కళ్ళు తెరిచింది!

# ప్రజాస్వామ్య వేదిక

మారణాయుధాలు నిషేధిస్తూ
చట్టం చేసిన సభ్యులు
యథేచ్ఛగా ఆయుధాలు
విసురుకొనే వేదికే అసెంబ్లీ!

# ఫలితాలు

పాలకుల వాగ్దానాలు
వ్యాకోచనం చెంది
ఇంటింటికో ఉద్యోగం
పంచిపెడుతున్నాయి!
వాగ్దానాల ఫలితాలు
సంకోచం చెంది
ఊరికో ఉద్యోగం
ఇచ్చి వెడుతున్నాయి!

# ధర్మానికి రెండు పాదాలు

నాలుగు పాదాల ధర్మానికి
రెండు పాదాల నడక నేర్పడం
నిత్యం
న్యాయస్థానాల కసరత్తు!

సిగ, దిండు సంఘర్షణలో
క్షణకాలం ఒరిగిపోతే
ఒక ప్రాణికి పూర్వక్రియ!
సిగ, దిండు సంఘర్షణలో
క్షణకాలం నలిగిపోతే
ఒక ప్రాణికి ఉత్తరక్రియ!
మునుమాపు వేళలో
కళ్ళు తెరిచి సిగకెక్కిన మల్లెపువ్వు
తొలిప్రొద్దు వేళకు కన్నుమూసింది!

## అధిక ధరలు

అధిక ధరల్ని
ఆకాశం మొయ్యలేక
నాలుగు చెరగులా
నేలను తాకింది!

# స్పృహలేని రచన

ఎన్ని తూటాలు వుంటేనేం
గురి తప్పుతుంటే
ఎంత కవితాత్మ వుంటేనేం
గతి తప్పుతుంటే!

# కథ వెనక కథ

ధనం పిరికిది
ఇనప్పెట్టిలో దాగుతూంది!
దాగిన పిరికిది
ధనికునికి ధైర్యం యిస్తూంది!

# పరిపాలన

మహారణ్యంలో
మృగరాజు నిర్ణయాలే
జనారణ్యంలో
నియంతల నిర్ణయాలు!

# వృద్ధ నిరుపేద

ఎట్టకేలకు
నా చూపు
సూది రంధ్రాన్ని
జయించింది!
కానీ
నా అతుకుల బొంత
సూదిని
ఓడించింది!

## మారుతున్న జనసంఖ్య

అన్యదేశాల వద్ద
అప్పుడుగుతున్నప్పుడు
పవిత్ర భారతదేశ
ప్రజల సంఖ్య
డెబ్బయి కోట్లు!
తెచ్చిన అప్పును
ప్రణాళిక పేరున
పంచుతున్నప్పుడు
మనదేశ జనాభా
డెబ్బయిమందే!

## గులాములు

చస్తూ
బతికే
బతుక్కి
చావు
బతుకు
గులాములు!



ఆడిగోపుల వెంకటరత్నమ్

## ఏ రోజు కా రోజు

మూరెడు గుడ్డ దొరికినప్పుడు
బిడ్డ పెరగలేదని
జానెడు గుడ్డ దొరికినప్పుడు
బిడ్డ పెరిగాడని
బాధపడ్తూ బ్రతికేవే
నిరుపేదల చిరుబ్రతుకులు!

## మళ్ళీ పరుగు

పేదవాడి గుడిసెకెళ్ళి
ప్రశాంతంగా బైటపడ్డ గాలి
ఉన్నవాడి ఏ. సి. గదికెళ్ళి
ఒక్క తన్నుకు బైటపడింది
సెగలు స్వేదం కక్కింది!
ఐనా
ఈ గాలికి బుద్ధిలేదు
ఉన్నవాడి గదికెళ్ళను
మళ్ళీ ఉరుకులు పరుగులు!

## రంగు మార్పిడి

రంగు వేసిన
బ్యాలెట్ పెట్టెలో
రంగు మార్చిన
నాయకుని జననం
తిరోగమన పయనం
ప్రజాస్వామ్య ఖననం!

## స్టార్ వార్స్

తల్లి ఆకాశం నిద్రపోతూంటే
అనుక్షణం భూమి నుండి వచ్చే
అపాయాల్ని పసిగట్టడానికి
ఆకాశంలో నిత్యం వెలిగే
టార్చిలైట్లే
బిడ్డలు నక్షత్రాలు!

# మారే లెక్కలు

ఇరవై నాలుగులు అరవయ్యని
కూలి లెక్కల రోజున
ఇరవై నాలుగులు నూట ఇరవయ్యని
వడ్డీ లెక్కల రోజున
ఇరవై నాలుగులు ఎనభయ్యని
తనయుడికి ట్యూషన్ రోజున
ఎక్కాల లెక్కలు
వల్లిస్తుంటాడు భూస్వామి!

# జీవితం

రెండు
ఉదయాల మధ్య
దాగున్నదే
మరణం!
వేయి
ఉదయాలకు వ్యాపించేదే
జీవితం!

# దోపిడి

ఉచ్ఛ్వాస
నిశ్వాసల మధ్య
ఊపిరి
దాగివున్నట్లు
శక్తి
శ్రమల మధ్య
దోపిడి
దాగివుంది!

# ఎరుపంటే...

ఎర్రింకును చూసి
నల్లింకు భయపడింది
తను చేసిన తప్పుల్ని
తప్పక పట్టుకొంటుందని!
ఎర్రింకును చూసి
కాగితం ఎగిరి గంతేసింది
చేసిన తప్పుల్ని దిద్ది
ఒప్పుల్ని చూపెడుతుందని!
ఎరుపంటే అంత భయమెందుకు
అదిచ్చేది వెలుగైతే!

## ప్రజానాయకుడు

ప్రజలు చేయి వదిలినా
ప్రజల చేయి వదలని వాడే
ప్రజాస్వామ్య వ్యవస్థలో
ప్రజానాయకుడు!

## రైతు

పొట్ట చేత పట్టుకొని
ఎటో పోదామంటే
పొలం వుంది!
పొలం పండించి
పొట్ట నింపుకొందామంటే
ప్రక్కనే
తుఫాను పొంచివుంది!

# చట్టం లొసుగులు

చట్టాల పొరల్లో
చీకటి వ్యాపారం దాగుంది
నులకను బాదితేగాని
నల్లులు రాలవు!

# ప్రజలారా...

పాకడమే చేతగాని ప్రభుత్వం
పరుగులు తీస్తానంటూంది
పడిపోతుంది
పట్టుకోండి!
పరుగులు తీయాల్సిన ప్రభుత్వం
పాకుతూ వుంది
పడిపోతుంది
మార్చుకోండి!

# ఆకలి

వాళ్ళకిచ్చిన అనెస్తీషియా
ఇంకా పనిచేస్తూనే వుంది
వడ్డించిన విస్తళ్ళను వాళ్ళు
వీపు మీద మోస్తూనే వున్నారు
ఆకలి తీర్చుకొన్నవాడు
ఆకల్ని మరిచాడు
దాహం తీర్చుకొన్నవాడు
బావిని పూడ్చాడు
భూమిపై పడ్డ నీటిబొట్టు
పారుతూనే వుంది
రాలిన రక్తపు బొట్టు
భూమిలో దాగుతూనే వుంది
అంతా సజావుగా సాగుతూనే వుంది!

# కాలం కుంటుతూ వుంది

నెలకోసారి వచ్చి వెళ్తున్న
ఎన్నికలకు వీడ్కోలు చెప్తూ....
మీడియం వేవ్‌లోనూ
షార్టు వేవ్‌లోనూ
ట్యూన్ చెయ్యకుండానే
వీనులకు విందు చేస్తున్న
నాయకుల వాగ్దానాలను వింటూ....
నిన్నటి సన్మాన వేదికపై
సన్మానం చేసినవాడే చంపి
నేడు చనిపోయిన వాడికి
సంతాపం చెప్పడం చూస్తూ....
నిన్నటి కుంభకోణం
సశేష గాథకు నేడు సమాప్తం చదివి
నేటి కుంభకోణం సీరియల్ కోసం
రేపటికి ఎదురు చూస్తూ....
పదిమంది నాయకులు కలసి పారేసిన
పది జెండాల్ని ఏరుకొని
రేపటి కోసం దాచుకొని
పది పార్టీలు కలసి వెలసిన
ఐక్యపార్టీ జెండా ఆవిష్కరణను చూస్తూ....
ముచ్చిలి గుంటలో కళ్ళున్న
మహానాయకులు
ముందు నడక చూపెడుతుంటే
కాలం కుంటుతూ వుంది
చరిత్ర నడుస్తూ వుంది!



అడిగోపుల వెంకటరత్నమ్

# బూటకం

బావిలోని కప్ప
చెర్లోకి వెళ్ళింది
బావి జీవితమే
బాగుందంటూ
తిరిగి తిరిగి చెప్తూంది!
ఆహా!
నా రేడియోనే
నేను నమ్మలేని స్థితి
ఉట్టికెక్కిన వాళ్ళంతా
ఇదే స్వర్గం అంటున్నారు!
ఒంటినిండా రక్తం వుంది
ఏం లాభం?
సిరలు
ధమనులు
పనిచెయ్యడం లేదు!

# నడుస్తా...పాడుతా...రాస్తా

నడుస్తాను....నడుస్తాను
లక్ష్యంతో
తపస్సుతో
నేర్చుకొన్న నడకను నేర్పుతూ
జీవించకుండానే మరణించే
జీవితాలు జీవించేలా
మనస్సుల్లో మార్మోగుతూ
గుండెల్లోకి చొచ్చుకుంటూ
నడుస్తూనే వుంటాను:
పాడుతాను....పాడుతాను
దీక్షతో
ధ్యాసతో
చెట్లు పుష్పించేలా
మోళ్ళు చిగురించేలా
రాళ్ళు నడిచేలా
గళాలు విప్లవించేలా
పాడుతూనే వుంటాను:
రాస్తాను....రాస్తాను
కృషితో
ధ్యేయంతో

మనిషి మనిషి సూర్యుడై
విప్లవిస్తే వెలుగని
అజ్ఞాన తిమిరం
దోపిడీ మయమని
తూర్పు గాలులు వీచేలా
శృంఖలాలు తెగేలా
రాస్తూనే వుంటాను:
పోరాటానికి పునాది
పరాజయం
గెలుపుకు పునాది
ఓటమి
నా చేతిలోని ఉలితో
నా ప్రజల్ని చెక్కుకొంటూ
నా ప్రజల్ని తీర్చిదిద్దుకొంటూ
నడుస్తా....పాడుతా....రాస్తా!

# ప్రపంచ పండుగ మే డే

ప్రపంచ పండుగ మేడే
కన్నుల పండుగ ఈనాడే
కానీ
సమ్మె హక్కుపై
వేతన నిర్ణయంపై
కార్మిక ఐక్యతపై దైవాంశ సంభూతుల
దోపిడీ రక్కసుల
నిరంతర కర్కశ దాడులు!
శ్రామిక జనానికి నయా సంకెళ్ళు
కూలుతున్న సామ్రాజ్యవాద కుట్రలు!
ఇంక్విలాబ్ జిందాబాద్
విప్లవం వర్ధిల్లాలంటూ
మార్క్సు మహత్తర ఆశయం
ఎలుగెత్తి చాటు శ్రామికశక్తీ....
ఓ ప్రపంచ కార్మికశక్తీ....
ఎలుగెత్తిన గొంతుతో
పలు గొంతులు కలుస్తాయి
విప్లవం నీది
విజయం నీది!
చేతి సంకెళ్ళు
చిరకాలం వుండవు
కమ్ముకొన్న చీకటి
కలకాలం వుండదు!

# జవాబు

ప్రభుత్వం పాదరసం
ప్రజలు అస్పృశ్యులు
వచ్చి పోయే సంవత్సరాలు
వయసును పెంచేవేగాని
మనిషిని పెంచేవికావు చెల్లీ!
అనావృష్టి అయితేనేం
కర్షకుల కళ్ళు వర్షఋతువులై
వర్షించాక
విత్తనాలకై వెయ్యిగడప
వెతికి పట్టి నాటితే
నా పొలం
పురుగుల పెంపక కేంద్రమైంది!
పురుగుమందు కత్తిరాయుళ్ళతో
అధికార్ల కలయిక
ప్రభుత్వం కర్షకుడికి యిచ్చిన
ప్రజాస్వామ్య కానుక!
ఆఖరికి తురుపు ముక్కగా
మాంగల్యం అమ్మి మందులు చల్లితే
మాంగల్యబల మహిమనుకొంటా
పురుగు పొలంలో పులి అయింది!
నీ వుత్తరం అందింది చెల్లీ
నీ ఆందోళన అర్థమైంది తల్లీ
చనిపోను విషం కొనుక్కోలేని
ఆర్థిక పరిస్థితి నాది
నేనెందుకు చనిపోతాను చెల్లీ!

# ఎర్రజీర

భరత ఖండపు భావిజీవీ
కర్మభూమికి ఉషోదయమా!
ఉదయించిన సూర్యుడు మార్గమధ్యంలో
ఎప్పుడో హత్యయి వుండేవాడు
ఉత్తర దక్షిణ దిక్కులు
సెక్యూరిటీ గార్డులై
పశ్చిమ దిశకు చేరుస్తూ వుండకపోతే!
నీ పయనంలో నిత్యం అప్రమత్తం సుమీ....
నువ్వెప్పుడూ నీ నీడను నమ్మకు
అదెప్పుడు నీకు అద్దం పట్టింది?
పొడుగ్గానో....మరీ పొడుగ్గానో
పొట్టిగానో....మరీ పొట్టిగానో
నిన్ను చూపటం తప్ప
నిన్ను నిన్నుగా చూపిందెప్పుడు?
ఎత్తుగడలో నువ్వు అత్యంత జాగ్రత్త సుమీ....
మూసిన తలుపులు మంత్రాలకు తెరుచుకోవు
వెలుగు కళ్ళాపి నీ ఇంటిముందు చల్లి చూపు
ఇన్ని పచ్చిక బయళ్ళు ఎవరికోసం?
ఇంత విశాల ఆకాశం నీ కోసం!
గుండెలోని పాటను గొంతులోకి రానివ్వు
మనసులోని నిర్ణయాన్ని చేతల్లో చూపించు
కంటిలోని ఎర్రజీర కడుపులోనిదని చెప్పు!



అడిగోపుల వెంకటరత్నమ్

# మేలుకొని ఏరుకో

కాళ్ళు జాపితే
కాళ్ళదాకా దుప్పటి లేదు
ఎంతకాలం
లద్దెపురుగు జీవితం?
అగాధంలో పడి
కాళ్ళూ చేతులు విరగ్గొట్టుకున్న నీళ్ళు
అక్కడి చెట్లను బ్రతికిస్తున్నాయి
ఎక్కడున్నా ప్రాణరక్షణ!
సుదర్శన చక్రం
శిశుపాలుడ్ని వెంబడించింది
తప్పులు తల మునిగాయి!
సమాజం కలగూర గంప
పసిడి తీగలున్నాయి
మేలుకొని ఏరుకో!

# నలభై ఏళ్ళ స్వాతంత్ర్యం

దోపిడీ జన్మహక్కని
దౌర్జన్యం వృత్తిపరమని
అవినీతి జీవిత భాగమని
నమ్మి నడిచిన నాయకులకు
ఇన్నేళ్ళ స్వాతంత్ర్యం
ఎదురులేని స్వేచ్ఛాపథం!
ఆనాటి స్వాతంత్ర్యంనాటి నుండి
ఉదయించిన ఉదయాల్ని లెక్కిస్తే
కూడు దొరకని ఉదయాలు కొన్ని
కూలి దొరకని ఉదయాలు కొన్ని!
వయసు పెరిగిన స్వాతంత్ర్యంలో
మనిషి పెరగని మరుగుజ్జు
నాలుగువేళ్ళూ నోట్లోకి పోని చరిత్రే
నలభై ఏళ్ళ మన స్వాతంత్ర చరిత్ర!



ఆడిగోపుల వెంకటరత్నమ్

# నేటికి రేపటి దారి చూపకు

నేడు నేటితో
పోరి గెలువు
నేటికి రేపటి
దారి చూపకు!
రేపుకు రక్షణ
ఎల్లుండి పుడుతూనే వుంది!
నిన్నను నేటితో దాటావు
ఆ నిన్నలు
కోకొల్లలై
కాలచక్రంలో కలిశాయి
నేటికి నీపై నమ్మకముంది
ఇక
నేటికి రేపటి దారి చూపకు!

# నోటికందని చేతిముద్ద

మబ్బులు తెల్లచీర విప్పేసి
నల్లచీర ధరించాయి
ప్రసవించడానికి!
కర్షకుల కళ్ళల్లో
మబ్బులు తొలగిపోయి
కాంతులు నిండాయి!
పుట్టబోయే బిడ్డకోసం
పొలాలు పొత్తిళ్ళయి
చేతులు పైకెత్తాయి!
ఒక తడి చినుకులుపడి
ఎండబోయే పంట
పండబోతున్నదని
జనావళి కలలు కన్నారు!
ఎవరనుకున్నారు
ఆరోగ్యంగా వున్న ఆ మబ్బులు
అనాకారి
నెలలు నిండని బిడ్డను కంటాయని!
చేతికి అందిన ముద్ద
నోటికి అందకుండా పోతుందని!

# నిజం నిద్రపోతూ వుంది

ధర్మం ఇంటింటా ఆగి
శ్రీరామచంద్రుని చరిత్ర చెప్పి
దశకంఠుని వేనోళ్ళ స్తుతిస్తోంది!
న్యాయం ఇంటింటికీ ఏగి
ద్రౌపది వస్త్రాపహరణం చెప్పి
దుశ్శాసనుడ్ని శ్లాఘిస్తూ వుంది!
దానం ఇంటింటిలో దూరి
సూతపుత్రుని చరిత్రచెప్పి
ఇంద్రుని కొనియాడుతూ వుంది
అహింస ఇంటింటికీ తిరిగి
గాంధీకథ చెప్పి
గాడ్సేను పొగడుతూ వుంది!
నిజం నిత్యం నిదురపోతూ వుంది
అబద్ధం నిజమై ఆడుతూ వుంది!

# చేయి కలుపుతున్నాను

చూస్తున్నాను! చూస్తున్నాను!
చీకట్లో చిరుదీపం
ఉరేసుకోవడం
చివికిన బ్రతుకుల్ని
చీకటి పెనేసుకోవడం
మోడువారిన జీవులు
చిగురించకపోవడం
జీవమున్న విత్తులు
మొలకెత్తకపోవడం
శ్రీరాముళ్ళు
సీతల్ని వదిలేయడం
హరిశ్చంద్రులు
చంద్రమతుల్ని అమ్మేయడం
చూస్తున్నాను! చూస్తున్నాను!
తిమిరంలో
కాంతికోసం
సంకుచితత్వం లేని
సమతా మమతల కోసం
సమ సమాజం వెలిసే
సమయం కోసం
ఎదురుచూస్తున్నాను
సాధనకై చేయి కలుపుతున్నాను!







అడిగోపుల వెంకటరత్నమ్